WAHADAT-E-BANI ADAM
(Telugu)

# మానవులంతా ఒక్కటే

మూలం:

**మౌలానా సయ్యిద్ జలాలుద్దీన్ ఉమరి**

అనువాదం:

**అబ్దుల్ వాహెద్**

అనంతకరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# మానవులంతా ఒక్కటే

## ఆలోచన ఆచరణలలో వైవిధ్యం

పూర్వం గతించిన వారు, ప్రస్తుతం బ్రతుకుతున్న వారు, భవిష్యత్తులో పుట్టనున్న వారు - సమస్త మానవుల్ని ఒక చోట చేర్చి, వారి భావావేశాలను గురించి, వారి అవసరాలను గురించి వారిని ప్రశ్నించినట్లయితే అందరి సమాధానం ఒకే విధంగా ఉంటుంది. ఆనందం, దుఃఖం లాంటి సహజ భావనలు లేనివాడు, ప్రకృతి సహజ వాంఛలు లేనివాడు ఒక్కడు కూడా ఉండడు. ఇతరుల భావావేశాలకు భిన్నమైన భావావేశాలు కల మనిషి, లేదా ఇతరుల సహజ అవసరాలకు భిన్నమైన అవసరాలుకల మనిషి ఎవ్వడూ కనబడడు. అయినప్పటికీ మనుషులు విభిన్న వర్గాలుగా, విభిన్న తెగ లుగా విభజనకు గురయ్యారు. ప్రతి వర్గం ఇతర వర్గాలతో ఘర్షణ పడుతోంది. ప్రతి వర్గం తన ప్రకృతి భిన్నమైనదన్నట్లు, ప్రతి వ్యక్తి తన నైజం భిన్నంగా ఉన్నట్లు ఎదుటివారితో పోరాడుతున్నాడు. తమ తమ భావావేశాలు, సహజ అవసరాలు వేర్వేరుగా ఉన్నట్లు ప్రతి ఒక్కరితో మరొకరు తలపడుతున్నారు. ఆసియాలో బ్రతికే మనిషి జీవితావసరాలకు, అమెరికాలో ఉన్న వారి జీవితావసరాలకు మధ్య పొంతన లేదన్నట్లు, యూరప్ వారి మౌలికావసరాలు ఆఫ్రికన్ల మౌలికావసరాలకు భిన్నంగా ఉన్నట్లు, రోమన్ల కోపోద్రేకాలకు భిన్నమైన భావోద్రేకాలు గ్రీకులకు ఉంటాయన్నట్లు వీరంతా వ్యవహరిస్తున్నారు.

## జీవితానికి లక్ష్యం కావాలి

సహజ భావోద్రేకాల రీత్యా, సూత్రప్రాయమైన ప్రయోజనాల రీత్యా మనుషులంతా ఒక్కటే. అయినప్పటికీ వారి మధ్య ఘర్షణలు పోరాటాలకు కారణమేమిటి? ఒకర్నొకరు నష్టపరిచేలా పురికొల్పుతున్న, రక్తపాతానికి పాల్పడేలా ప్రేరేపిస్తున్న అంశం ఏది? ఈ ప్రశ్నలకు సమాధానం ఒక్కటే. మనిషి ప్రపంచ జీవితంలో ఒక లక్ష్యం ఉండాలని కోరుకుంటున్నాడు. తన ఆకాంక్షలు,

అభిరుచులు, అభిలాషలకు కేంద్రంగా ఒకే లక్ష్యాన్ని నిర్ణయించుకొంటు న్నాడు. తన శక్తిసామర్థ్యాలన్నింటినీ అంకితం చేయదగ్గ లక్ష్యం, ధనప్రాణాలను, కాలాన్ని అన్నింటినీ పణంగా పెట్టదగిన ఒక లక్ష్యం జీవితానికి కావాలని ప్రతి మనిషి అభిలాష. తద్వారా మానసిక సంతృప్తి పొందాలని కోరుకుంటాడు. తన జీవిత పరమార్థం కాగలిగే ఒక లక్ష్యం లేనిదే మనిషికి శాంతి లభించదు. అలాంటి లక్ష్యం యేదీ లేకుండా మనిషి బ్రతకలేడు. కాని, ఈ జీవిత లక్ష్యాన్ని అన్వేషిస్తున్న మనిషి దారికానక తిరుగుతున్నాడు. అదే అతడి వైఫల్యాల గాథకు ప్రారంభం.

## సంకుచిత లక్ష్యాలు

ప్రపంచంలో చాలా మంది అవలంబించే జీవిత లక్ష్యాలను గమనిస్తే అత్యంత అల్పమైనవిగా, అతి సాధారణమైనవిగా కనిపిస్తాయి. వీళ్ళు తమ వ్యక్తిగత పరిధిలోపల మాత్రమే తిరుగాడుతుంటారు. వారి దృష్టిలో మహా అయితే తమ భార్యాపిల్లల ప్రయోజనాలు చోటు చేసుకుంటాయి. ఈ సంకుచిత పరిధిని దాటి కొందరు ఆలోచించినా వారి ఆలోచనలు కూడా ఏదో ఒక పరిధికి కట్టుబడి పరిభ్రమిస్తూ ఉంటాయి; ఆ పరిధిని దాటి ముందుకు సాగవు. అల్పమైన లక్ష్యాల కొరకే తమ శక్తిసామర్థ్యాలు వెచ్చిస్తారు. ఈ సంకుచిత లక్ష్యాలలో యే ఒక్కటి కూడా అది ఎంత ప్రయోజనకరమైనది అయినప్పటికీ, ఎంత లాభదాయకమైనది అయినప్పటికీ, సమస్త మానవాళికి మానవులలోని విభిన్న వర్గాలు, తెగలన్నింటికీ వర్తించే లక్ష్యంగా నిలబడలేదు. ఇలాంటి లక్ష్యంపట్ల మనుషులందరికీ మక్కువ గలగడం, అందరిలోనూ ఆసక్తి జనించడం అసాధ్యం. మనుషుల మధ్య విభేదాలు, ఘర్షణలకు మూలకారణం ఇదే- లక్ష్యాలు, ఉద్దేశ్యాలు, ఆశయాల ఘర్షణ.

## వంశం కోసం....

సంకుచిత జీవిత లక్ష్యాలకు ఒక చరిత్ర ఉంది. మానవాళి తెగల రూపంలో జీవితం గడుపుతున్న కాలంలో మనిషి తన తెగకు, వంశానికి సేవ చేయడమే జీవిత లక్ష్యంగా భావించేవాడు. తెగ ప్రయోజనం కోసం కృషి చేయడం, తెగను అన్ని విధాలా సమర్థించడం, తెగకు సహాయపడడం, శత్రువుల బారి నుంచి తెగను కాపాడడం పవిత్రమైన లక్ష్యంగా మనిషి భావించేవాడు. కారణం, తెగ మనిషిని పోషిస్తుంది; తెగ మనిషికి ఒక ఉనికిని ఇస్తుంది; విభిన్న

కార్యకలాపాలకు మనిషిని సమాయత్తపరుస్తుంది. మనిషి తనకు లభించిన శక్తిసామర్థ్యాలు, బలసంపదలకుగాను తెగకు రుణపడి ఉంటాడు. అందువల్ల ఆయా శక్తిసామర్థ్యాలను తెగను సేవించడానికి వినియోగించడమే న్యాయం. అందువల్ల తెగ ప్రయోజనాల కోసం తన శక్తిసామర్థ్యాలను వినియోగించేవాడు ధన్యుడిగా పరిగణింపబడుతాడు.

## భాషే ప్రధానమైనది

చరిత్ర మరికాస్త ముందుకు సాగిన తర్వాత మనిషి ఆలోచనల తీరు కూడా మారింది. మనిషి శక్తిసామర్థ్యాలను పెంచి పోషించేది అతడు పుట్టిన తెగ మాత్రమే కాదని, మనిషి వృద్ధివికాసాలలో ఇతర తెగల పాత్ర కూడా ఉందని, అందువల్ల కేవలం తన తెగ బాగోగులు మాత్రమే ఆలోచించడం, దాని ప్రయోజనాల కొరకే పని చేయడం భావ్యం కాదని మనిషి గ్రహించాడు. మనిషి సేవలు, త్యాగాలు కేవలం తన తెగకే పరిమితం కారాదని, ఒకే భాష మాట్లాడే తెగలన్నింటికీ మనిషి సేవలూ, త్యాగాలు విస్తరించాలని భావించడం జరిగింది. ఎందుకంటే, భాష మాత్రమే వివిధ తెగలను కలిపే సాధనమనీ, భాష వల్లనే భావ సారూప్యత ఏర్పడుతుందనీ, ఫలితంగా తెగలు ఒకదానికొకటి దగ్గర అవుతాయనీ, పరస్పర సహాయ సహకారాల వాతావరణం ఏర్పడుతుందని మనిషి తలపోశాడు.

వంశం, తెగ, ఒకే భాష మాట్లాడే సమూహాల మధ్య ప్రేమాభిమానాల వల్లనే మనుషులలో సేవాభావం, తన వారిని కాపాడాలనే భావం కలిగాయన్నది నిజం. అందువల్లనే సమాజంలో శ్రేయోసంక్షేమ పథకాలు రూపొందాయి. శత్రువుల బారి నుంచి రక్షించే ప్రయత్నాలు జరిగాయి. అభివృద్ధి మార్గాల అన్వేషణ జరిగింది. ఒక ప్రత్యేక పరిధిలో ప్రయోజనాలూ చేకూరాయి. కాని, ఈ కారణం వల్లనే ఇతర తెగలతో ఇతర భాషా సమూహాలతో దూరాలు పెరిగాయి. ఒక తెగ ప్రయోజనాలకు, మరో తెగ ప్రయోజనాలకు మధ్యన, అలాగే ఒక భాషా సమూహం ప్రయోజనాలకు, మరో భాషా సమూహం ప్రయోజనాలకు మధ్యన పొంతన కుదరనపుడు భేదాభిప్రాయాలు జనించాయి. విద్వేషం, వైషమ్యాలు పెరిగాయి. కలహాలు, ఘర్షణలు, హత్యాకాండ, రక్తపాతాలతో భూమి ఎర్రబడింది. ఈ వినాశానికి చరిత్ర మౌనసాక్షిగా నిలిచింది.

## జాతీయతా భావనలో లోపాలు

కొన్ని వందలు లేదా వేల మైళ్ళ పరిధికి మించి భాష విస్తరించదు. మానవ ప్రయోజనాల పరిధి దీనికన్నా ఎంతో విస్తృతమైనది. దూర ప్రాంతాల వరకు వ్యాపించి ఉంటుంది. తన భాషకు భిన్నమైన భాష మాట్లాడే ప్రజలతో కూడా మనిషికి ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక సంబంధాలు ఎంతో పటిష్టమై ఉంటాయి. ఆయా సమూహాలు కూడా ఇతని పట్ల సాన్నిహిత్యం, సమైక్యతా భావం కలిగి ఉంటాయి. ఈ సంబంధాలు సాధారణంగా ప్రత్యేక భూభాగాన ఉన్న మానవుల మధ్యనే ఏర్పడతాయి. ఈ భూభాగం సహజంగానే రుతువులు, వాతావరణం, పర్వతాలు, నదులు, ఉత్పత్తి సాధనాలు ఇత్యాది వాటి కారణంగా ఒకే విధంగా ఉంటుంది. నైసర్గికంగా ఇతర ప్రాంతాలకు భిన్నంగా ఉంటుంది. మనిషి ఈ భూభాగం అంతటితోనూ, ఇందులోని ఒక్కొక్క వస్తువుతోనూ ప్రయోజనం పొందుతూ ఉంటాడు. మనిషి సంస్కృతీసభ్యతలు ఇక్కడే జనిస్తాయి. అందువల్లనే ఆ భూభాగమంతటికీ సేవ చేయాలన్న దృష్టి మనిషిలో ఏర్పడాలని భావించడం జరిగింది. ఆ భూభాగాన ఎన్నెన్ని భాషలు మాట్లాడే వారున్నా, ఎన్ని విభిన్న తత్వాలు గలవారు అక్కడ నివసిస్తున్నా, ఎన్ని తెగలు దాన్ని ఆశ్రయించిఉన్నా, ఎన్నెన్ని వంశాలు, వర్ణాల ప్రజలు అక్కడ స్థిరపడి ఉన్నా - వారందరూ ఒకే జాతిగా, ఆ ప్రాంతం ఆ జాతికి 'మాతృభూమి'గా రూపొందుతుంది. ఈ భావనే జాతికి ప్రాతిపదిక. జాతి లేక మాతృదేశం ఏర్పడడానికి మరికొన్ని కారణాలున్నాయి. వీటన్నింటి దృష్ట్యా జాతిని, మాతృ భూమిని సేవించడం, దానికి తోడ్పాటు అందజేయడం, సమర్థించడం జీవిత పరమార్థంగా భావించబడుతుంది.

నేడు కూడా ఇదే అత్యున్నత జీవిత లక్ష్యంగా భావించబడుతోంది. జాతి కోసం, దేశం కోసం మాత్రమే జీవించడం, మరణించడం, ఎట్టి పరిస్థితిలోనూ దాన్ని రక్షించడం, సమర్థించడం మానవుని అత్యుత్తమ ధ్యేయంగా పరిగణింపబడుతోంది. ఈ ధ్యేయం కోసం సమసిపోయే వ్యక్తి మహాయోగ్యుడు అవుతాడు. అతని స్మృతి చిహ్నాలు కట్టడం, అతని పేరిట ఉత్సవాలు జరుపడం ప్రజల కర్తవ్యంగా భావించబడుతుంది. అతను మరణించిన తర్వాత అతని ప్రతిమ లేక చిత్రపటం ముందు గౌరవసూచకంగా మర్యాదలు పాటించడం, అతన్ని చరిత్ర పుటల్లో చిరస్థాయిగా భద్రపరచడం గొప్ప విశేషంగా పరిగణింపబడుతుంది.

ఈ జాతితత్వం వల్ల నాగరికతలో రెండు పెద్ద రుగ్మతలు చోటు చేసు కొన్నాయి. మొదటిది: ఈ భావం సహజంగానే మనిషిలో దురభిమానాన్ని సృజిస్తుంది. జాతితత్వం నిండిన వ్యక్తి తప్పనిసరిగా తన జాతి ప్రయోజనాలు మాత్రమే కోరుకుంటాడు. ఇతర జాతుల శ్రేయోసంక్షేమాల పట్ల అతనికి ఎలాంటి ఆసక్తి ఉండదు. తన జాతికి లాభదాయకమైతేనే దేని గురించి అయినా ఆలోచిస్తాడు. ప్రతి విషయంలోనూ జాతి ప్రయోజనాలే అతడి దృష్టిలో ఉంటాయి. జాతికి ప్రయోజనకరమైన పని చేయడానికి అత్యుత్సాహంగా ముందుకు వస్తాడు. ఆ పని వల్ల ఇతర జాతులకు ఎంత నష్టం వాటిల్లుతున్నా లెక్కచెయ్యడు. అలాగే తన జాతికి నష్టం కలిగించే పని వల్ల ఇతర జాతులకు విస్తృత ప్రయోజనాలు చేకూరుతున్నప్పటికీ, దానిని అనవసరమైన పనిగా, నిషిద్ధమైనదిగా భావిస్తాడు. ఇలాంటి వ్యక్తి జాతిని ఆరాధించే పరమ భక్తునిగా పరిగణింపబడతాడు. అతని దృష్టిలో ధర్మాధర్మాల విచక్షణ ఉండదు. కేవలం తన జాతి లాభనష్టాల పైనే దృష్టి ఉంటుంది. ఇలాంటి వ్యక్తి తన సంకుచిత దృక్పథాన్ని వదులుకొని, ప్రతి వర్గం, ప్రతి జాతి శ్రేయాన్ని కోరే వ్యక్తిగా మారితే అతడు మానవతావాది అవుతాడు. జాతి వాదిగా మిగులడు.

## జాతితత్వంలోని రెండవ రుగ్మత

ఈ భావం మనుషులందరినీ ఒకే దృష్టితో చూడదు. మనుషుల మధ్య నిమ్నోన్నతల అనేక ప్రమాణాలను సృష్టిస్తుంది. ప్రభుత్వం, అధికారం చేతుల్లో ఉన్న జాతికి అత్యున్నత స్థానాన్ని ఒక్కొక్కసారి కట్టబెడుతుంది. మరో సారి ప్రత్యేక భాష మాట్లాడే ప్రజలు అత్యున్నతులుగా ప్రకటిస్తుంది. లేదా కేవలం ఒక ప్రత్యేక వంశానికి, ఒక ప్రత్యేక భూభాగానికి చెందిన వారే శ్రేష్ఠులని తీర్మానిస్తుంది. ఇలాంటి భావనల ప్రాబల్యం ఉన్న చోట మానవ సమానత్వానికి చోటు ఉండదని తెలుస్తూనే ఉంది.

ఇది జాతీయ భక్తియుగం. ఇందులో పైన పేర్కొన్న రెండు రుగ్మతలు పూర్తిగా దర్శనమిస్తాయి. ఓ వైపు జాతీయ దురభిమానం పూర్తి స్థాయిలో పెరిగింది, మరో వైపు నేటి మనిషి మానవ సమానతాభావాన్నే మరచిపోయాడు. అందువల్ల నేడు రాజ్యాధికారం హస్తగతం చేసుకొన్న జాతి ఏదైనా తన పాలనలో ఉన్న ఇతర జాతులకు జీవించే హక్కు కూడా ఇవ్వడానికి సిద్ధంగా లేదు. ఇతర

జాతుల వృద్ధివికాసాలను అది సహించదు. వాటి అభివృద్ధి మార్గంలో అనేక ఆటంకాలను, కంటకాలను సృష్టిస్తుంది. ఈ చేదు ఫలితాలను అనుభవించిన తర్వాత, మానవ సంక్షేమం అన్నది జాతితత్వంలో ఉందని ఎవరయినా ఎలా చెప్పగలరు? జాతితత్వం వల్ల ప్రపంచానికి సుఖశాంతులు ప్రాప్తమవుతాయని ఎవరు అనగలరు?

## వైరం జనిస్తుంది

నిజం చెప్పాలంటే, ఈ సంకుచిత లక్ష్యాలు మనుషుల మధ్య విభేదాలను సృష్టించాయి. మనుషుల మధ్య విద్వేషం, వైరాల బీజాలునాటాయి. ప్రతి వ్యక్తి సంకుచిత పరిధిలోనే ఆలోచిస్తున్నాడు. ఇతరుల సమస్యలు, సాధకబాధల పట్ల ఆసక్తి కనబరచడంలేదు. మంచో, చెడో తన వర్గం ప్రయోజనాలను సాధించడమే ముఖ్యం అనుకుంటున్నాడు. అంతర్జాతీయ సంబంధాలు కూడా స్వీయ ప్రయోజనాల ప్రాతిపదికన మాత్రమే నెలకొంటున్నాయి. తన జాతి ప్రయోజనాల కోసం ఇతర జాతుల ప్రయోజనాలకు విఘాతం కలిగించడానికి వెనుకాడడం లేదు. ఓ వర్గం మరో వర్గంతో ఘర్షణపడుతోంది. ఓ జాతి మరో జాతితో తలపడుతోంది. ఈ విధంగా మానవాళి సుఖశాంతులకు దూరమైపోతోంది. యుద్ధ మేఘాలు నలువైపులా అలుముకొంటున్నాయి. మనిషి భయాందోళనలతో బ్రతుకవలసి వస్తోంది. ఎప్పుడు ఏం జరుగుతుందో, యే జనావాసాలు స్మశానాలుగా మారుతాయో తెలియని స్థితిలో బిక్కుబిక్కు మంటూ బ్రతుకు గడుపుతున్నాడు.

## వసుధైక కుటుంబ భావన

ఈ సమస్య పరిష్కారానికి వసుధైక కుటుంబ భావన ప్రతిపాదించబడుతోంది. అంటే జాతులన్నీ తమ ఉమ్మడి ప్రయోజనాల ప్రాతిపదికన ఒక్కటై, ఆయా ప్రయోజనాలను సాధించడానికి కలసికట్టుగా కృషి చేయడం. తాము బ్రతుకుతూ ఇతరులను బ్రతుకనీయడం. కాని ఇది కేవలం ఒక ఆదర్శభావన మాత్రమే. ప్రపంచం ఈ భావనను ఇంతవరకు ఆమోదించలేదు. మనిషి తీసుకొనే నిర్ణయాలన్నీ, మనిషి సేవలన్నీ అతడు నమ్మే సిద్ధాంతాలకు అనుగుణంగా ఉంటాయి. సిద్ధాంతాల ప్రాతిపదికనే యుద్ధం, సంధి, స్నేహం, వైరం అన్నీ ఆధారపడి ఉంటాయి. సిద్ధాంతాల వల్లనే సంబంధాలు సుదృఢం అవుతాయి, లేదా బలహీనపడతాయి.

సైద్ధాంతిక విభేదాలు ఉంటే స్పర్ధలు సహజంగానే పుడతాయి. కమ్యూనిజంపట్ల విశ్వాసం కలిగి ఉన్న వ్యక్తి పెట్టుబడిదారీతత్వం వైపు స్నేహ హస్తాన్ని చాచడం అసాధ్యం. అలాగే ఒక జాతితత్వవాది ఆ తత్వాన్ని వ్యతిరేకించే వ్యక్తిని సహించలేడు. సైద్ధాంతిక విభేదాల చరిత్ర చూస్తే, విభిన్న సిద్ధాంతాలుగల వారి మధ్య ఎల్లప్పుడు ఘర్షణలే కనబడతాయి. అలాంటి ఈ అంశం నేడు ప్రేమాభిమానాలకు కారణం అవుతుందంటే ఎలా నమ్మగలం? ఇది మనిషి సహజ ప్రవృత్తికి సంబంధించిన ప్రశ్న. ఎవ్వరూ కాదనలేని ప్రశ్న. వసుధైక కుటుంబ భావనను ప్రతిపాదించేవాళ్ళు నేటి వరకు ఈ ప్రశ్నకు జవాబీయలేదు.

## మానవ ఏకతకు పునాదులు

మానవ ఏకతకు ఇస్లామ్ ఒక సమగ్రమైన, విస్తృతమైన, విశ్వజనీనమైన నిర్వచనాన్ని ఇచ్చింది. అందుకు అవసరమైన దృఢమైన పునాదులు వేసింది. ఇస్లామ్ మానవ ఏకత్వానికి వేసిన మొదటి పునాది: మనుషులంతా ఒకే దైవానికి దాసులే, ఒకే దేవుడు సృష్టించిన జనులే అన్న విశ్వాసం. రెండవ పునాది: అందరి ఆది మూలం ఒక్కటే అనే విశ్వాసం. కాబట్టి బయటకు ఎన్ని విభేదాలు కానవస్తున్నప్పటికీ అందరూ ఒక్కటే. ఈ ప్రాతిపదికనే ఇస్లామ్ సమస్త మానవాళిని సమైక్యపరుస్తుంది. ఈ మార్గంలో ఎదురయ్యే ఆటంకా లను, దురభిమానాలను ఒక్కటొక్కటిగా ఏరివేస్తుంది. ఇస్లామ్ ప్రతిపాదించిన ఈ విశ్వాసాలను అంగీకరిస్తే విభేదాల చీకట్లనుంచి సుహృద్భావ సూర్యుడు ఉదయించగలడు. పరస్పరం సంఘర్షిస్తున్న జాతులు వర్గాలు కలసిమెలసి జీవించడం సాధ్యపడుతుంది.

## ఒకే దేవుని దాసులు

దైవం అనే పదానికి సరియైన సమగ్రమైన భావనను ఇస్తుంది ఇస్లామ్. ఇస్లామీయ బోధనలకు ఈ భావనయే ప్రాణం. అంచనాలకు అందని విస్తృతి కలిగి ఉన్న ఈ విశాల విశ్వం ఒకే ఒక్క దేవుని సృష్టి అన్న వాస్తవాన్ని సాక్ష్యాధారాలతో ప్రతిపాదిస్తుంది. ఆ ఒకే ఒక్క దైవానికి మాత్రమే ఈ విశ్వంపై ఆధిపత్యం ఉంది. దేవుని అసంఖ్యాక సృష్టిరాసుల్లో మనిషి కూడా ఒకడు. ఆ దేవుడే అందరి పోషకుడు, స్వామి, ఆరాధ్యుడు, పాలకుడు. మనిషి కోసం గాలి, నీరు, వెలుతురు, చీకటి, వేడిమి, చలి అన్నీ ఆ దేవుడే సృష్టించాడు. ఆ దేవుడే మనిషికి

జీవనోపాధి ఇచ్చేవాడు, పోషించేవాడు. ఆ దేవుని చేతుల్లోనే మనిషి జీవన్మరణాలున్నాయి. మనిషి ఆయురారోగ్యాలు, సౌభాగ్య దౌర్భాగ్యాలు అన్నీ ఆయన చేతుల్లోనే ఉన్నాయి. మనిషి మొరలను వినేవాడు ఆయనే, కోరికలు తీర్చేవాడు ఆయనే. కష్టాల నుంచి గట్టెక్కించగలవాడు, అవసరాలకు ఆదుకోగలవాడు ఆయనే. మనిషికి నిజమైన అండనివ్వగలవాడు ఆయనే. ఆశ్రయమిచ్చేవాడు ఆయనే. ఆయన ఆశ్రయమివ్వకపోతే మనిషికి ఎక్కడా చోటు లభించదు. ఆయన చేయూతనీయకపోతే మరెక్కడా సహాయం దొరకదు. ఆయన చేసిన మేళ్ళు అసంఖ్యాకం. ఆ మేళ్ళలో మనిషి మునిగి పోయి ఉన్నాడు. వాటిని లెక్కపెట్టనూ లేడు; వాటికి ప్రతిగా తగిన రీతిలో కృతజ్ఞతలు చెల్లించనూ లేడు.

**"ఆయన అల్లాహ్‌యే, భూమిని ఆకాశాలను పుట్టించిన వాడు, ఆకాశం నుంచి నీళ్ళను కురిపించినవాడు; తర్వాత దాని ద్వారా మీ ఉపాధి కల్పన కొరకు రకరకాల ఫలాలను సృష్టించినవాడు; తన ఆజ్ఞానుసారం సముద్రంలో నడువాలని పడవను మీకు హస్తగతం చేసినవాడు; నదుల్ని మీ కొరకు క్రమబద్ధం చేసినవాడు; నిరంతర ప్రయాణం చేస్తున్న సూర్యచంద్రుల్ని మీ కొరకు నియమబద్ధం చేసినవాడు; రాత్రిని, పగలును మీ కొరకు నియమించినవాడు; ఇంకా మీరు అడిగిన సమస్తాన్ని మీకు ఇచ్చినవాడు. నువ్వు గనుక అల్లాహ్ అనుగ్రహాలను లెక్కించదలిస్తే, లెక్కించ లేవు. యధార్థం ఏమిటంటే మాన వుడు మహాఅన్యాయపరుడు; కృతఘ్నుడు."**

(ఇబ్రాహీం : 32 - 34)

## జీవిత ధ్యేయం

ఏకైక దేవుని ఆరాధించడానికే మనిషి పుట్టాడు. ప్రపంచంలో మనిషి అసలు స్థానం ఇదే. ఈ విధానమే మనిషికి శోభిస్తుంది. ఈ విధంగానే మనిషి దేవుని అనుగ్రహాలకు కృతజ్ఞత చెల్లించగలడు. తాను దేవుని దాసుడని నిరూపించు కోగలడు.

**"మానవులారా! మిమ్మల్ని, మీకు పూర్వం వారిని సృష్టించిన మీ ప్రభువును సేవించండి. దీని ద్వారానే మిమ్మల్ని మీరు రక్షించుకొనే అవకాశం ఉంది. మీ కొరకు భూమిని పాన్పుగాను, ఆకాశాన్ని కప్పుగాను సృష్టించిన వాడు, పై నుంచి వర్షాన్ని కురిపించి, తద్వారా అన్ని రకాల పంటలు పండే ఏర్పాటు చేసి మీకు**

ఉపాధి కల్పించినవాడు ఆయనే. ఇది మీకు తెలిసి ఇతరుల్ని అల్లాహ్‌కు సమానులుగా నిలబెట్టకండి." (బఖర : 21 - 22)

## ప్రవక్తల బోధన

ప్రవక్తలు (అ.స.) అందరూ బోధించినది దీనినే. ప్రవక్తలు మనిషికి హితబోధను, మార్గదర్శనాన్ని అందజేయడానికి వివిధ కాలాల్లో విభిన్న భూభాగాలలో దేవుని నిమిత్తం ఆవిర్భవించారు. చివరి ప్రవక్త ముహమ్మద్ (స) వరకు ఈ పరంపర కొనసాగింది.

"మేము నీకు పూర్వం యే ప్రవక్తను పంపినా అతనికి వహీ ద్వారా...... 'నేను తప్ప దేవుడు లేడు కనుక మీరు నాకే దాస్యం చేయండి'అన్న విషయాన్నే తెలియజేశాము." (అంబియా : 25)

## అందరూ ఒక్కటి కాగలరు

ఈ జీవిత లక్ష్యం ఏదో ఒక వర్గానికి, ఎవరో ఒక వ్యక్తికి, ప్రత్యేక జాతికి లేదా దేశానికి సంబంధించినది కాదు. నిజానికి ఇది పూర్తి మాన వాళికి సంబంధించిన జీవిత లక్ష్యం. భాగ్యవంతుడికి, నిరుపేదకు, అభివృద్ధి గాంచిన వాడికి, వెనుకబడిన వాడికి, భారతీయుడికి, చైనీయుడికి, ఆసియా వాసికి, యూరపు నివాసికి, అమెరికావానికి, రష్యావానికి, అందరికీ సంబంధించినది. వేరు వేరు వ్యక్తులకు, వేరు వేరు వర్గాలకు విభిన్న జీవిత లక్ష్యాలను దేవుడు నిర్దేశించలేదు. అందరికీ ఒకే లక్ష్యాన్ని ఇచ్చాడు. భూమిపై నివసిస్తున్న ప్రతి వ్యక్తినీ, ప్రతి వర్గాన్ని ఆదేశిస్తూ దేవుడు తననే ఆరాధించాలన్నాడు. ప్రపంచంలోని ఏకైక ఉన్నత జీవిత లక్ష్యం ఇదే. ఇదే ప్రాక్ పశ్చిమాలలో, ఉత్తర దక్షిణాలలో ఉన్న సమస్త మానవాళికి జీవిత లక్ష్యం కాగల లక్ష్యం. వర్గం, వర్ణం, జాతి, మత భేదాలు లేకుండా మనుషులందరూ ఈ లక్ష్యం కోసం ఏకం కాగలరు. ఈ లక్ష్యం కేవలం అరబ్బులది మాత్రమేనని అరబ్బే తరులు చెప్పలేరు. ఈ లక్ష్యం తమకు సంబంధించినది కాదని ప్రాచ్య పాశ్చాత్య దేశాలు యేవీ అనలేవు. ఎందుకంటే ఇది ప్రతి ఒక్కరి హృదయస్పందన. దీని ద్వారానే మనిషిలోని సహజ తృష్ణ తీరుతుంది. ఇందులో అన్ని వర్గాలు, వర్ణాలు, జాతుల ప్రజలను ఆకర్షించే శక్తి ఉంది. తన సృష్టికర్త, పోషకుడు, రక్షకుడు అయిన దైవం వైపునకు

నడువడం, ఆ దైవానికి దగ్గర కావడం అన్నది మనిషి సహజ ప్రవృత్తి. ఎందుకంటే జీవిత పయనంలో ప్రతి అడుగు లోనూ దేవుని శరణు కోరడం, దైవ సహాయాన్ని అర్థించడం మనిషికి తప్పదు. కష్టాలు, కడగండ్లు ఎదురయినపుడు మనిషి దేవుని అండ కొరకు పరితపిస్తాడు. సుఖ శాంతులలో దేవునికి కృతజ్ఞతలు చెల్లిస్తాడు. మనిషి చేసే దైవదాస్యంలోనూ, దైవారాధనల్లో అన్నింటిలోనూ స్వయాన మనిషి స్వార్థం ఉంది. అలాగే దైవాన్ని తిరస్కరించడం వల్ల, దైవం పట్ల అవిధేయత చూపడం వల్ల మనిషికే నష్టం. అలాగే, దేవుడు యే ఒక్క వర్గానికో, వంశానికో, తెగకు లేదా ప్రత్యేక ప్రాంతానికో చెందినవాడు కాదు. ప్రతి చోట ఉంటాడు.

ఆయన సర్వాంతర్యామి. ప్రతి మనిషిని ఆయన చూస్తున్నాడు. ప్రతి మనిషి ప్రార్థనలను వింటున్నాడు. సహాయాన్ని అందిస్తున్నాడు. ప్రతి మనిషి దైవంతో సంబంధాన్ని నెలకొల్పుకోగలడు. నల్లవారయినా, తెల్లవారయినా, సేవకులయినా, యజమానులయినా, కర్షకులయినా, కార్మికులయినా, వ్యాపారులయినా, విద్యార్థులయినా, ఉపాధ్యాయులయినా, పాలకులయినా, పాలితులైనా అందరూ దేవుని దృష్టిలో సమానులే. అందరూ దేవుని వైపునకు నడువగలరు. దైవసాన్నిహిత్యాన్ని, దేవుని ప్రేమను అందరూ పొందగలరు. ప్రత్యేక జాతిలో, ప్రత్యేక వంశంలో పుట్టుక ఆధారంగా యే వ్యక్తీ దేవుని దృష్టిలో ఉన్నతుడు కాడు. అలాగే హోదా పదవుల వల్ల కూడా దైవం దృష్టిలో ఔన్నత్యాన్ని పొందలేడు. దేవుని కరుణాకటాక్షాలు పొందడానికి బీదరికం అడ్డుకాదు. అలాగే దైవ కారుణ్యం పొందడానికి సిరి సంపదలు తోడ్పడవు. తన వైపునకు అడుగులు వేస్తున్న ప్రతి వ్యక్తినీ సాదరంగా స్వాగతించడానికి దైవం సిద్ధంగా ఉంటాడు. ఆఫ్రికా వాడయినా లేక అమెరికా వాడయినా, ఇంగ్లీషు మాట్లాడే వాడయినా లేక హిందీ మాట్లాడే వాడయినా, ఎవరయినా సరే, దైవ దాస్యానికి స్వయం సమర్పణ చేసుకొనే వ్యక్తికి ఎలాంటి ఆటంకమూ లేదు. మారుమూల ప్రాంతాల నుంచి పిలిచే వారి పిలుపును కూడా ఆయన ఆలకిస్తాడు.

**"నా దాసులు నన్ను గురించి నిన్ను అడిగితే, నేను వారికి అత్యంత సమీపంలో ఉన్నాననీ, పిలిచేవాడు నన్ను పిలిచినపుడు నేను వారి పిలుపును వింటాను, జవాబిస్తాననీ ఓ ప్రవక్తా! నీవు వారికి తెలుపు. కనుక వారు నా సందేశం విని దాన్ని స్వీకరించాలి. నా పట్ల విశ్వాసం కలిగి ఉండాలి (ఈ**

విషయం నీవు వారికి వినిపించు). వారు రుజుమార్గం పొందే అవకాశం ఉంది."
(అల్ బఖర : 186)

ఈ విశ్వానికంతటికీ ఒకే దేవుడు ఉన్నాడు. మనుషులు అందరూ ఆ దేవునికే దాసులు. మనుషులందరూ ఆయన్ని ఆరాధించడానికే జన్మించారు- ఈ భావన మనుషుల మధ్య విభేదాలను, వైషమ్యాలను తొలగిస్తుంది. మనుషులందరినీ ఒక్కటి చేస్తుంది. దేవుని విశ్వసించిన మనిషిలో హోదా ప్రతిష్ఠల హేయమైన భావాలు జన్మించవు. దైవానికి దాస్యం చేయాలన్న స్పృహ వల్ల సేవకుడు స్వామి, పాలకుడు పాలితుడు, కూలివాడు యజమాని, నల్లవాడు తెల్లవాడు, అరబ్బు అరబ్బేతరుడు - అందరూ ఒకే పంక్తిన నిలబడతారు. నిమ్నోన్నతలు మరచి ప్రజలందరూ దేవుని ముందు సాష్టాంగపడతారు.

## మూలం ఒక్కటే

మానవాళి ఒకే ప్రాణి, ఒకే వ్యక్తి ద్వారా ప్రారంభమయ్యిందని ఖుర్ఆన్ అనేక పర్యాయాలు నొక్కి చెప్పింది. ఆ ఆదిపురుషుని నుంచి అతని జీవిత భాగస్వామిని సృష్టించడం జరిగింది. వారు ఇరువురి నుంచి వారి వంశం విస్తరించింది. తెగలు ఉనికిలోకి వచ్చాయి. జాతులు, సమాజాలు ఏర్పడ్డాయి. జనాభా భూమండలంపైన విభిన్న ప్రాంతాలలో విస్తరిస్తూ పోయింది. అందువల్లనే ఖుర్ఆన్ ఓ చోట ఇలా ప్రస్తావించింది:

"మానవులారా! మీ ప్రభువునకు భయపడండి. ఆయన మిమ్మల్ని ఒకే ప్రాణి నుంచి పుట్టించాడు. అదే ప్రాణి నుంచి దాని జతను సృష్టించాడు. ఇంకా ఆ జంట ద్వారా ఎంతో మంది పురుషులను, స్త్రీలను అవనిలో వ్యాపింప జేశాడు. ఏ దేవుని పేరు చెప్పుకొని మీరు పరస్పరం మీ మీ హక్కులను కోరు కుంటారో ఆ దేవునికి భయపడండి. బంధుత్వ సంబంధాలు తెంచటం మాను కోండి. అల్లాహ్ మిమ్మల్ని పరికిస్తున్నాడని తెలుసుకోండి." (నిసా : 1)

## మానవ సమానతకు విఘాతం

మనుషులందరు ఒకే జంట సంతానమని విశ్వసించిన తర్వాత వారంతా ఒకరికొకరు సోదరులు అవుతారు. ప్రపంచంలో ఈ మూల నుంచి ఆ మూల వరకు ఉన్న మనుషులందరూ ఒకరికొకరు సోదరులు. దేవుడు మనుషుల మధ్య

సోదర, సన్నిహిత సంబంధాలు ఏర్పరిచాడు. వీటిని త్రెంచే అనుమతి ఇస్లామ్ ఇవ్వదు. అలాంటి ప్రయత్నాలన్నింటినీ ఇస్లామ్ తీవ్రంగా ఖండిస్తుంది. ఈ సోదర భావాన్ని, ఈ సమానతను భంగపరిచే ప్రయత్నాలను ఇస్లామ్ ఉపద్రవాలుగా పరిగణిస్తుంది. ఈ విషయమై హజ్రత్ మూసా (అ.స.) ఫిర్‌ఔన్‌ల గాథ సవివరంగా ప్రస్తావించబడింది. ఫిర్‌ఔన్ దైవధిక్కారానికి పాల్పడ్డాడు. జాతిని తరగతులుగా విభజించాడు. ఒక తరగతి పాలకులది, రెండవది పాలితులది. ఈ విభజన వల్ల తలెత్తిన ఉపద్రవాన్ని హజ్రత్ మూసా (అ.స.) ద్వారా దైవం పరిష్కరించాడు. బాధితులను ఆదుకొన్నాడు. దౌర్జన్యపరుల ఆటలు కట్టించాడు. ఈ విషయమై ఖుర్‌ఆన్ ఇలా పేర్కొంది:

**"అసలు విషయం ఏమిటంటే ఫిర్‌ఔన్ భూమిపై తిరుగుబాటు వైఖరి అవలంబించాడు. దాని ప్రజలను వర్గాలుగా విభజించాడు. వారిలోని ఒక వర్గాన్ని అతడు నీచపరిచాడు. వారి బాలురను హతమార్చేవాడు. బాలికలను మాత్రం బతుకనిచ్చేవాడు. నిశ్చయంగా అతడు దుష్టులలోని వాడు. భూమిలో అణచి వేయబడిన వారిని కనికరించాలని, వారిని నాయకులుగా చేయాలనీ, వారినే వారసులుగా చేయాలని, భూమిపై వారికి అధికారాన్ని ప్రసాదించాలని వారి ద్వారా ఫిర్‌ఔన్, హమానులకు, వారి సైన్యాలకు తాము భయపడుతూ వచ్చిన దానినే చూపాలని మేము కోరాము."** **(అల్ ఖసస్ : 4 – 6)**

## భేదాలు దేవుని సూచనలు

మనుషులలో కనిపించే రంగు, రూపం, జాతి, వంశం, భాష, మాండలికం, వృత్తి, వ్యాపారం, జాతీయత, ప్రాంతీయత మొదలైన భేదాలను ఇస్లామ్ దేవుని అనేక సూచనలలో ఒక సూచనగా పేర్కొంటుంది. ఈ విశ్వంలో, దాని పోషకుడు, యజమాని అయిన దేవుని అధికార ప్రాబల్యం అంతం లేనిదని ఈ సూచనలు తెలుపుతున్నాయి. దేవుడు తాను కోరిన వారికి అందం ఇస్తాడు. తాను తలచిన వారిని వికృతంగా రూపొందిస్తాడు. తాను కోరిన వారికి సిరిసంపదలు ఇస్తాడు. తాను తలచిన వారికి దారిద్ర్యాన్ని లిఖిస్తాడు. తాను కోరిన భూభాగంపై పుట్టిస్తాడు. తాను తలచిన భాష నేర్పిస్తాడు. దైవికంగా ప్రాప్తించే ఈ లక్షణాలను ఎవరయినా వ్యక్తి తన ఆధిక్యతకు లేదా న్యూనతకు నిదర్శనాలుగా భావిస్తే, అతడు

నిజానికి ఈ సూచనల నుంచి పాఠం గ్రహించలేని నిర్భాగ్యుడు. ఈ సూచనల ద్వారా దేవుని నిదర్శనాలను గ్రహించే దృష్టి లేనివాడు.

**"ఆయన సూచనలలో ఒకటి ఏమిటంటే, ఆయన మిమ్మల్ని మట్టితో సృష్టించాడు. తర్వాత అకస్మాత్తుగా మీరు మానవులు అయ్యారు. (భూమిపై) వ్యాపిస్తూ ఉన్నారు. ఆయన సూచనలలో మరొకటి ఏమిటంటే ఆయన మీ కొరకు భార్యలను మీ (మానవ) జాతి నుంచే సృష్టించాడు. మీరు వారి వద్ద శాంతిని పొందడానికి, మీ మధ్య ప్రేమను, కారుణ్యాన్ని సృజించాడు. నిశ్చయంగా ఆలోచనాపరులకు ఇందులో ఎన్నో సూచనలు ఉన్నాయి. ఆయన సూచనలలో ఆకాశాలను భూమిని సృష్టించడమూ, మీ భాషలు, రంగుల్లో వైవిధ్యమూ ఉన్నాయి. నిశ్చయంగా విజ్ఞులకు ఇందులో ఎన్నో సూచనలు ఉన్నాయి. ఆయన సూచనలలో రాత్రి పగలు, మీరు నిద్రపోవడం, మీరు ఆయన అనుగ్రహాన్ని అన్వేషించడం కూడా ఉన్నాయి. నిశ్చయంగా (శ్రద్ధగా) వినే వారికి ఇందులో చాలా సూచనలున్నాయి. (అర్రూమ్ : 20 : 23)**

పైన పేర్కొన్న ఖుర్ఆన్ వ్యాక్యాల్లో అనేక వాస్తవాలున్నాయి.

1. దైవం మనిషిని మట్టితో సృష్టించాడు - ఈ ప్రకటన ద్వారా మనిషిలో ఉండే జాతి, వంశ, ఆర్థిక, విద్యా దృక్పథపరమైన అహంభావాలన్నింటినీ పటాపంచలు చేయడం జరిగింది. ఏ దేశానికి రాజయినా లేక ఏ బలమైన జాతికి చెందినవాడయినా, అతి పెద్ద పెట్టుబడిదారుడయినా, పారిశ్రామికవేత్త అయినా, అత్యున్నత విద్యార్హతలు గలవాడయినా, శారీరక బల సంపద ఉన్నవాడయినా - ఎవడయినా సరే మట్టితో రూపొందించబడ్డాడన్నది వాస్తవం. మట్టి అన్న పదంలో విధేయత, సేవాభావం ఉన్నాయి. మట్టితో రూపొందిన మనిషి తన జీవిత వాస్తవాన్ని గుర్తించక, తన శక్తిపరిమితులను గ్రహించనప్పుడు మనిషిలో గర్వం చోటుచేసుకుంటుంది.
2. స్త్రీ పురుషులను కూడా ప్రపంచం అధికులు, అల్పులుగా వర్గీకరిం చింది. పురుషుడు అధికుడనీ, స్త్రీ అధమురాలనీ నిర్ధారించింది. నేటికి కూడా ఈ విభజన ఆచరణలో కనబడుతోంది. కాని, మనిషికి అతడి జతను అతడి జాతి నుంచే పుట్టించామన్న ఖుర్ఆన్ ప్రకటన వల్ల ఈ అసహజ విభజన

రద్దవుతోంది. పురుషుని జతగా స్త్రీని అతడి (మానవ) జాతినుంచే పుట్టించడం జరిగింది. మరో జాతినుంచి కాదు. అందువల్ల స్త్రీ పురుషుల్లో ఒకరు ఎక్కువ, మరొకరు తక్కువ అన్నది అనవసర విభజన. దైవం స్త్రీ పురుషుల మధ్య ప్రేమాభిమానాలు సృజించాడు. వారి మధ్య విద్వేష వైరాలు మానవ సహజ ప్రవృత్తికి విరుద్ధమైనవి.

3. దేవుని సూచనలను యే వ్యక్తీ నిరాకరించలేడు (భూమ్యాకాశాల సృష్టి కూడా దేవుని సూచనలలో ఒకటి) అని చెప్పడం జరిగింది. అంతేకాదు భూమ్యాకాశాల మధ్య లక్షల మైళ్ళ దూరం ఉన్నప్పటికీ ఈ రెంటి మధ్య సమతూకం దైవాదేశం వల్లనే ఏర్పడింది. ఇవి దైవం నిర్దేశించిన పద్ధతి ప్రకారం ఎలాంటి అసంతులనం లేకుండా పరిభ్రమిస్తున్నాయి. ఇదే విధంగా మనుషులు కూడా దైవాదేశాలను తు.చ. తప్పక పాటిస్తే వారి మధ్య ఉన్న కలహాలు, ఘర్షణలు, వివాదాలు సమసిపోతాయి. మనుషుల మధ్య సమైక్యత జనిస్తుంది.

4. రంగు, రూపం, భాషాభేదాలను కూడా దైవిక సూచనలుగా వర్ణించడం జరిగింది. దైవిక సూచనలు మనిషికి నీతి పాఠాలు నేర్పేందుకు ఉద్దేశించినవే తప్ప పరస్పరం కొట్లాడుకోడానికి కాదని వేరే చెప్పనక్కరలేదు.

5. ప్రపంచంలోని ప్రతి వ్యక్తి నిద్రిస్తాడు. మేలుకొంటాడు. ఉపాధి అన్వేషణలో నిమగ్నుడవుతాడు. ఇది కూడా దైవిక సూచనయే. ప్రపం చంలోని ప్రతి వ్యక్తి అనేక అవసరాలు కలిగి ఉంటాడు. మనుషుల సహజ అవసరాలు ఒకే విధంగా ఉంటాయని ఈ సూచన తెలియజేస్తోంది. మనుషుల అవసరాలు ఒకే విధంగా ఉన్నప్పుడు ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ అనుకోవడం అర్థరహితం.

ఈ వాస్తవాల గురించి ఖుర్ఆన్ అనేక చోట్ల ఒక్కోసారి విపులంగా, మరోసారి క్లుప్తంగా పేర్కొంది. ఈ వాస్తవాల గురించి మనిషి ఆలోచిస్తే, ప్రపంచ మానవుల మధ్య అనేక వ్యత్యాసాలు ఉన్నప్పటికీ మనుషులంతా మౌలికంగా ఒక్కటేనని విశ్వసించక తప్పదు.

## దైవభీతి

జాతి, వర్ణం, వంశం, భాష, తెగ, ప్రాంత భేదాలు దైవిక సూచనగా గ్రహించి వాటి నుంచి పాఠాలు నేర్చుకునేబదులు, దురదృష్టవశాత్తు, మనిషి ఈ విభేదాల ఆధారంగా నిమ్నోన్నతలు గౌరవ ప్రతిష్ఠలు ఆపాదించుకొన్నాడు. వాస్తవానికి రంగు, రూపం, భాష, వంశం, తెగ తదితర భేదాలకు గౌరవ ప్రతిష్ఠలకు ఎలాంటి సంబంధమూ లేదు. నిజానికి గౌరవ ప్రతిష్ఠలన్నవి మనిషి లోని దైవ విశ్వాసం, ఆచరణలపై ఆధారపడి ఉన్నాయి. తనను తాను దేవుని దాసునిగా నిరూపించుకొన్నవాడు, దైవానికి భయపడి జీవితం గడుపుతున్నవాడు, దేవుని కరుణాకటాక్షాలు పొందాలని ప్రయత్నించేవాడు మాత్రమే గౌరవ ప్రతిష్ఠలకు అర్హత గలవాడు. ఈ గుణగణాలు లేనివానికి దేవుని దృష్టిలో ఎలాంటి గౌరవాదరణలు ఉండవు. అలాంటి వ్యక్తికి ప్రపంచంలో ఎంత ఉన్నత స్థాయి హోదా ఉన్నా ప్రయోజనం లేదు. ఖుర్‌ఆన్ ఈ వాస్తవాన్ని ఎంత చక్కగా చెప్పిందో చూడండి: **"మానవులారా! మేము మిమ్మల్ని ఒకే పురుషుని నుంచి, ఒకే స్త్రీ నుంచి సృజించాము. తర్వాత మీరు ఒకరినొకరు పరిచయం చేసుకునేందుకు మిమ్మల్ని జాతులుగా, తెగలుగా చేశాము. వాస్తవానికి మీలో అందరికంటే ఎక్కువ భయ భక్తులుగలవాడే అల్లాహ్ దృష్టిలో ఎక్కువ గౌరవపాత్రుడు. నిశ్చయంగా అల్లాహ్ సర్వజ్ఞానం కలవాడు. సకల విషయాలు తెలిసినవాడు."** (అల్ హుజ్రాత్ : 13)

ఈ ఖుర్‌ఆన్ వాక్యం గౌరవ ప్రతిష్ఠలకు సంబంధించిన బూటకపు ప్రమాణాలను రద్దుచేసింది. పుట్టుక రీత్యా యే వ్యక్తికీ మరో వ్యక్తిపై ఆధిక్యం లేదు. మాతృగర్భం నుంచే యే వ్యక్తీ పుణ్యాల పంటనుగానీ, పాపాల మూటను గానీ వెంట తెచ్చుకోడు. అలాగే పుట్టిన వెంటనే వాని నుదుట ఆధిక్యతా ముద్రగాని, న్యూనతా కళంకం గాని ఉండదు.

మనిషి గౌరవోన్నతులు అతడిలోని దైవభీతి, సద్గుణాలపై ఆధారపడి ఉంటాయి. దేవుని దర్బారులో వర్గానికి, వర్ణానికి, వంశానికి ప్రాధాన్యం లేదు. దైవభీతికే ప్రాధాన్యం లభిస్తుంది. దైవభీతి కలవారే అక్కడ దేవుని కరుణాకటాక్షాలు పొందగలరు. దైవభీతి లేకుండా ప్రపంచంలో గడపిన వారిని అక్కడ దేవుని పట్టు నుంచి ఎవ్వరూ కాపాడలేరు.

## ప్రమాణాల సంస్కరణ

మనిషి గౌరవోన్నతులను నిర్ణయించడానికి ప్రపంచంలోని వివిధ జాతులు, తెగలు అనేక బూటకపు ప్రమాణాలను ఏర్పరచుకొన్నాయి. మహాప్రవక్త ముహమ్మద్ (స) ఈ రుగ్మతలన్నింటినీ సమూలంగా పెరికివేశారు. మనిషి గౌరవోన్నతులను నిర్ణయించే ప్రమాణం దైవభీతి ఒక్కటేనని ప్రకటించారు.

## జాత్యహంకారం, వంశ గర్వం

జాత్యహంకారం, వంశ గర్వం కలవాళ్ళు ఇతర జాతులకు, వంశాలకు సమాన స్థానం ఎన్నడూ ఇవ్వలేదు. వారితో సమాన స్థాయిలో వ్యవహరించడానికి ఒప్పుకోలేదు. మహాప్రవక్త ముహమ్మద్ (స) చివరి హజ్ యాత్ర సందర్భంగా చేసిన చారిత్రక ప్రసంగంలో ఈ రుగ్మతలను తీవ్రంగా ఖండించారు. ప్రవక్త (స) మాటల్లో : "**ప్రజలారా! వినండి, మీ అందరి ప్రభువు నిస్సందేహంగా ఒక్కడే. మీ తండ్రి కూడా ఒక్కడే. వినండి, అరబ్బుకు అరబ్బేతరునిపైగాని, అరబ్బేతరునికి అరబ్బుపైగాని, నల్లవారికి తెల్లవారిపైగాని, తెల్లవారికి నల్లవారిపైగాని ఎలాంటి ఆధిక్యత లేదు. కేవలం దైవభీతిగలవారి విషయంలోతప్ప. (మనిషికి ఎంత దైవభీతి ఉంటే అతను అంతగా ఔన్నత్యాన్ని పొందుతాడు).**" (ముస్నద్ అహ్మద్ : **411/5**)

అంతిమ హజ్ సందర్భంగా హిజాజ్ భూభాగమంతా ఆయన హస్తగతమై ఉంది. స్వయాన ఆయన అరబ్బు జాతి వారు. ఆయన సహచరులు అందరూ అరబ్బులే. అందువల్ల అరబ్బులలో తాము అధికులమన్న భావం జనించే ప్రమాదం ఉంది. ముహమ్మద్ (స) ఆ ప్రమాదాన్ని పూర్తిగా నివారించారు. మనుషులంతా ఒకే దేవుని దాసులని, ఒకే తండ్రి బిడ్డలనీ నొక్కి చెప్పారు. దైవభీతి కలవాడికే ఔన్నత్యం, గౌరవం లభిస్తాయని స్పష్టం చేశారు.

తన సహచరుడు అబూజర్ (రజి)తో ప్రవక్త (స) ఇదే విషయాన్ని ఇలా చెప్పారు: "**చూడు! నువ్వు యే నల్లవాడికన్నా, లేక తెల్లవాడికన్నా ఎక్కువ కాదు. అయితే దైవభీతితో నువ్వు వారందరినీ అధిగమించగలవు.**"(ముస్నద్ అహ్మద్ : **158/5**)

## అహంకారం

కుటుంబపరమైన, తెగపరమైన అహంకారం కూడా మానవ ఏకత్వాన్ని

దెబ్బతీసింది. మహాప్రవక్త ముహమ్మద్ (స) ఈ రుగ్మతలను కూడా పెరికివేశారు. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) మహాప్రవక్త (స) ప్రవచనాన్ని ఇలా ఉటంకించారు: **"అజ్ఞాన స్థితిలో మరణించిన తాతముత్తాతల పట్ల గర్వించకండి. నా ప్రాణాలు ఎవరి అధీనంలో ఉన్నాయో ఆ దేవుని సాక్షి, అశుద్ధాన్ని కెలుకుతూ తిరిగే పేడపురుగు అజ్ఞాన స్థితిలో మరణించిన మీ తాతముత్తాతల కన్నా మెరుగు."**

(ముస్నద్ అహ్మద్, తహ్‌కీక్ అహ్మద్ ముహమ్మద్ షాకిర్ : 260-261/4)

ఇదే విషయం మరింత వివరంగా మరో ప్రవచనంలో ఉంది. అబూ హురైరా (రజి) ఈ ప్రవచనాన్ని ఉల్లేఖించారు: **"ప్రజలు తమ తాతముత్తాతలపై (అజ్ఞాన స్థితిలో మరణించిన వారిపై) గర్వించడం మానాలి. ఎందుకంటే, వాళ్ళు నరకానికి ఇంధనం అయిపోయారు. వాళ్ళు దేవుని దృష్టిలో అశుద్ధాన్ని తన ముక్కుతో కెలుకుతూ తిరిగే పేడ పురుగుకన్నా హీనమైపోయారు. దైవం మీ నుంచి అజ్ఞానపు గర్వాన్ని, తాత ముత్తాతల గురించి అహంకారాన్ని తొలగించాడు. మనుషులు రెండు రకాలు: విశ్వాసులు, దైవభీతిపరులు లేదా అవిశ్వాసులు, దుర్మార్గులు. వీళ్ళందరూ ఆదమ్ సంతా[illegible] సృష్టించబడ్డారు."**

[illegible] : బాబ్‌ఫిత్తఫాఖుర్)

హజ్రత్ సమర బిన్ జందబ్ (రజి) మహాప్రవక్త (స) ప్రవచనాన్ని ఇలా ఉటంకించారు: **"వంశం అన్నది ఒక సంపద వంటిది. గౌరవోన్నతులు దైవభీతిలో ఉన్నాయి."** (అబ్‌వాబుజ్ జుహద్, బాబుల్ వరావత్తఖ్వా)

నిజానికి కుటుంబ సంబంధం వంశావళితో ఉంటుంది. కాని ప్రపంచం దృష్టిలో సిరిసంపదలకే ప్రాముఖ్యం ఉంది. ఎవరి వద్ద సంపద ఉంటే వారి వంశం కూడా ఉన్నతమయినదవుతుంది. కాని, గౌరవోన్నతులు కేవలం దైవభీతి వల్లనే ప్రాప్తిస్తాయి.

హజ్రత్ అబూ హురైరా (రజి) ప్రకారం, ఓసారి ఓ వ్యక్తి ప్రవక్త ముహమ్మద్ **(స)తో "ప్రజల్లో అందరికన్నా ఉన్నతుడెవరు?" అని అడిగాడు. మహాప్రవక్త (స) జవాబిస్తూ "అందరికన్నా ఎక్కువ దైవభీతి కలవాడు" అన్నారు. తాను మరో విషయం తెలుసుకోడానికి ఈ ప్రశ్న అడిగానని అతను చెప్పినపుడు ప్రవక్త (స) "మీరు వంశప్రతిష్ఠల గురించి అడుగాలనుకొంటున్నారా" అని, "ఆ విధంగా చూస్తే అందరి కన్నా అధికుడు హజ్రత్ యూసుఫ్ (అ.స.). ఆయన స్వయాన**

దైవ ప్రవక్త, మరో ప్రవక్త హజ్రత్ యాకూబ్ (అ.స.)కు కుమారుడు. యాకూబ్ (అ.స.) కూడా మరో ప్రవక్త ఇస్‌హాక్ (అ.స.) కుమారుడు" అని జవాబిచ్చారు. ఈ సమాధానంలో ఉన్న అంతర్గత సూచన ఏమిటంటే, వంశ ప్రతిష్ఠ అన్నది కూడా ఆ వంశం వారిలో దైవభీతి ఉన్నప్పుడే ప్రాప్తమవుతుంది. దైవ ప్రవక్తలంటే అత్యధికంగా దైవభీతి, దైవభక్తి పరాయణత్వం, సచ్ఛీలం గలవారు. హజ్రత్ యూసుఫ్ (అ.స.)కు ఈ గౌరవం లభించదానికి కారణం ఆయన స్వయాన దైవ ప్రవక్త అవ్వడమే కాక ఆయనకు ముందు ఆ వంశంలో ముగ్గురు దైవ ప్రవక్తలు గతించారు. ఈ జవాబు విన్న సహచరులు తాము అడగదలిచింది వేరే విషయమని అన్నారు. అప్పుడు ప్రవక్త (స) వారితో, "మీరు బహుశా అరబ్బుల్లోని మాణిక్యాలను గురించి అడుగుతున్నారు. అజ్ఞాన కాలంలో మంచివారుగా అలరారిన వారు, ఇస్లామ్‌లోనూ మంచివారుగానే వెలుగొందుతారు. అయితే వాళ్ళు ఇస్లామ్‌లోని ఉన్నత జ్ఞాన సంపదను సాధించాలి" అన్నారు.

(బుఖారి, కితాబుల్ అంబియా, ముస్లిమ్, కితాబుల్ ఫజాయిల్)

ఇందులో కూడా ప్రవక్త (స) అజ్ఞాన కాలపు వంశ ప్రతిష్ఠల స్థానంలో ధార్మిక జ్ఞానానికి ప్రాధాన్యం ఇచ్చారు. అజ్ఞాన కాలంలో తమ ఉన్నత గుణగణాల రీత్యా మంచివారుగా ఎంచబడిన వాళ్ళు నేడు ఇస్లామ్ జ్ఞానాన్ని పొందితే, ఇస్లామీయ నడవడిని అనుసరిస్తే నేడు కూడా మంచివారుగానే ఉంటారు.

తమ వంశాన్ని చూసి గర్వించడం, ఇతరుల వంశాన్ని నీచపరచడం, కించపరచడం ఈ రెండు పనులు చెడ్డవే. అందరిలోనూ లోపాలు ఉంటాయి. లోపరహితంగా ఎవ్వరూ లేరు. దోషరహితుడు ఒక్క దేవుడు మాత్రమే. ఈ విషయమై దైవప్రవక్త ప్రవచనాన్ని హజ్రత్ ఉఖ్బా బిన్ ఆమిర్ (రజి) ఇలా పేర్కొన్నారు:

"వంశగౌరవం అన్నది ఇతరులను కించపరచడానికి నిస్సందేహంగా కాదు. మీరంతా మానవ సంతానం (అందరిలోనూ లోపాలున్నాయి). కొలపాత్రను పూర్తిగా నింపకుండా వదిలితే (ఎలా అసంపూర్ణమో) అదేవిధంగా దైవభీతి, ధర్మపరాయణతలు లేకుండా ఎవరికీ ఎవరిపైనా ఆధిక్యత లేదు. మనిషి సర్వనాశనం కావడానికి అతడి దుష్టసంభాషణ, లోభత్వం, వాచాలతలు చాలు."

(ముస్నద్ అహ్మద్ : 158/4)

## సిరిసంపదల అహం

సంపన్నులని, నిరుపేదలని, మనుషుల మధ్య విభజన ఏర్పడింది. భాగ్యవంతులు ఎల్లప్పుడు బీదలను, నిస్సహాయులను అణచివేస్తూ వచ్చారు. వారిని పీడించారు. ఫలితంగా శారీరక శ్రమ చేసే కూలీలని, భూస్వాములు జాగీరుదారులని మనుషులు విభజించబడ్డారు. వారి మధ్య ఘర్షణ మొదలయ్యింది. ఈ ఘర్షణే నేడు ఉచ్ఛస్థితికి చేరింది. పెట్టుబడిదారు కార్మికునికి తక్కువ చెల్లించాలనుకొంటున్నాడు. కార్మికుడు తన హక్కుకన్నా ఎక్కువ పొందాలనుకొంటున్నాడు. అంతటితో ముగియలేదు. ఆర్థిక స్థితినిబట్టి మనిషి సాంఘిక స్థాయిని నిర్ణయించడం మొదలయ్యింది. తన పెట్టుబడి వల్ల సుఖభోగాలు అనుభవిస్తున్న ధనవంతుడు సమాజంలో గౌరవ స్థానాన్ని పొందాడు. కాయకష్టం చేసేవాడు తక్కువ వానిగా పరిగణింపబడ్డాడు. ఇస్లామ్ ఈ రెండింటినీ ఖండించింది. ఓ వైపు బీదరికాన్ని పరిష్కరిస్తూ భాగ్యవంతుల సంపదలో బీదలకు హక్కునిచ్చింది. సంపాదనా వ్యయాలకు సంబంధించి నైతికమైన, చట్టబద్ధమైన నియమ నిబంధనలు విధించింది. జీవనభృతి కోసం సంపాదించేలా ప్రతి ఒక్కరినీ ప్రోత్సహించింది. ధర్మబద్ధమైన మార్గాలను ఎంచుకోవడంలో సహాయపడింది. జీవన భృతి సంపాదించుకోలేని అశక్తుల భారాన్ని మోసింది. మరోవైపు గౌరవ ప్రతిష్ఠలకు సిరిసంపదలు కారణం కాదని బహిరంగంగా ప్రకటించింది. సిరిసంపదలు గౌరవ ప్రతిష్ఠలకు ప్రమాణాలుగా భావించడం పెద్ద తప్పిదమనీ, ఈ తప్పుడు ప్రమాణాలు ప్రపంచం విడనాడాలని ప్రకటించింది. ప్రళయ దినాన దేవుడు మనిషి సిరిసంపదలను కాదు ఆచరణలను చూస్తాడు. మంచి ఆచరణ ఉన్నవాడే అక్కడ సాఫల్యం పొందుతాడు. చెడు నడవడి గలవాడిని దైవాగ్రహం నుంచి ఎవ్వరూ రక్షించలేరు. ఈ వాస్తవాన్ని ఖుర్ఆన్ స్పష్టంగా ప్రకటించింది: **"మిమ్మల్ని మాకు దగ్గర చేసేది మీ సంపద కాని, మీ సంతానం కానీ కాదు. విశ్వసించి సత్కార్యాలు చేసే వారు మాత్రమే (మాకు దగ్గరవుతారు). ఇటువంటి వారికే తాము చేసిన దానికి రెట్టింపు ప్రతిఫలం లభించేది. వారు ఎత్తయిన భవనాలలో సురక్షితంగా ఉంటారు. ఇక మా వాక్యాలను చులకన పరచడానికి నిరంతరం ప్రయత్నం చేసేవారు యాతనకు గురి అవుతారు."**

(సబా : 37 – 38)

ప్రభుత్వాధికారానికి కూడా సిరిసంపదలే ప్రమాణాలుగా ఉండేవి. ఖజానాల తాళాలు తమవద్ద ఉంచుకొన్నవాళ్ళు నిరుపేదలపై పెత్తనం చలాయించేవాళ్ళు, బీదలను పశువులకన్నా హీనంగా చూసేవారు. ఇస్లామ్ ఈ పరిస్థితిని మార్చింది. బనీ ఇస్రాయీల్‌కు సంబంధించిన ఓ సంఘటనను ప్రస్తావిస్తూ ఖుర్‌ఆన్, మానవుల్లో సిరిసంపదల వల్ల అధికార బలం ప్రాప్తం కాదనీ, అత్యుత్తమ మానసిక శారీరక శక్తులు అందుకు అవసరమని బోధించింది. బనీ ఇస్రాయీల్ ప్రజలు తమ ప్రవక్తకి విజ్ఞప్తి చేస్తూ శత్రువు (అమాలిఖ)తో పోరాడడానికి ఓ సేనానాయకుని నియమించండని అడిగినపుడు ప్రవక్త (స) వారి కోసం ఒక సమర్థుడయిన వ్యక్తిని (తాలూత్) చూపించాడు. ఆ వ్యక్తిని చూసి బనీ ఇస్రాయీల్ ప్రజలు ఆశ్చర్యంతో ఇలా అన్నారు.

"మాపై రాజ్యం చేసే హక్కు ఇతనికి ఎలా సంక్రమిస్తుంది? రాజ్యం చేసే హక్కు, అర్హత ఇతనికన్నా మాకే అధికంగా ఉన్నాయి. ఎందుకంటే ఇతను శ్రీమంతుడు కాదు."

సమాధానంగా ప్రవక్త (స) వారితో ఇలా అన్నారు: **"మీకు బదులు అల్లాహ్ అతనినే ఎన్నిక చేశాడు. అల్లాహ్ అతనికి బుద్ధిబలాన్ని, కండబలాన్ని సమృద్ధిగా ప్రసాదించాడు. తాను కోరిన వారికి తన రాజ్యం ప్రసాదించే అధికారం అల్లాహ్‌కు ఉంది. అల్లాహ్ అంతా వ్యాపించి ఉన్నాడు. సర్వమూ తెలిసినవాడు."**

**(బఖర : 247)**

భావం ఏమిటంటే తాలూత్ శ్రీమంతుడు కాకపోయినప్పటికీ అతనిలో అసాధారణ జ్ఞానం, ఆచరణాశక్తి ఉన్నాయి. దైవం వద్ద వీటికే ప్రాధాన్యం ఉంది. అందువల్ల ఇతనినే నాయకుడిగా నియమించడం ఉచితం. అతడి నాయకత్వాన్ని నిరాకరించడంలో వివేకం లేదు.

హదీసులు కూడా ఇదే వాస్తవాన్ని అనేక విధాలుగా బోధించాయి. దేవుని వద్ద సిరిసంపదలకు ఎలాంటి ప్రాముఖ్యం లేదని, దైవభీతి సదాచరణలకే ప్రాముఖ్యం లభిస్తుందని నొక్కి చెప్పాయి. హజ్రత్ సహల్ బిన్ సఅద్, సాఇది (రజి) ఇలా తెలిపారు: ఒక వ్యక్తి (కొన్ని రిఫరెన్సుల ప్రకారం అతడు ఖురైష్ వంశానికి చెందినవాడు, మంచి స్థితిమంతుడు, మంచి దుస్తులు తొడిగి ఉన్నాడు) దారిన

వెళుతున్నాడు. ప్రవక్త ముహమ్మద్ (స) తన సహచరులతో ఆ వ్యక్తి గురించి అభిప్రాయం ఏమిటని అడిగారు. అతను పెద్ద మనిషని ఒకరన్నారు. అతను ఎవరికన్నా పెళ్ళి ప్రతిపాదన పంపితే వెంటనే వివాహం జరిగిపోతుందని, అతను ఎవరికైనా సిఫారసు చేస్తే ఆ సిఫారసుపై పని జరుగుతుందని అన్నారు. కొద్దిసేపటి తర్వాత ఒక నిరుపేద అటు వెళ్ళాడు. ప్రవక్త (స) ఆ వ్యక్తి గురించి సహచరుల అభిప్రాయం అడిగారు. అతను ఫకీరు అని ఒకరన్నారు. ఎక్కడికన్నా పెళ్ళి ప్రతిపాదన పంపే యోగ్యత లేనివాడన్నారు. ఇతను సిఫారసు చేస్తే ఎవరూ వినరని చెప్పారు. అప్పుడు ప్రవక్త (స) **"మీరు పెద్ద మనిషి అని పేర్కొన్న లాంటి వ్యక్తులతో ఈ నేల నిండిపోయినా, వారందరి కన్నా ఈ ఒక్క ఫకీరు మెరుగు" అన్నారు. (బుఖారి, కితాబున్నికాహ్)**

హజ్రత్ అబూ హురైరా (రజి) ప్రవక్త (స) ప్రవచనాన్ని ఇలా ఉటంకించారు: **"అల్లాహ్ మీ రంగు రూపాలను, ధన సంపదలను చూడడు, మీ హృదయాలను, మీ ఆచరణలను చూస్తాడు." (ముస్లిం)**

## విస్తృతార్థం

ఈ విషయాన్ని మహాప్రవక్త ముహమ్మద్ (స) అనేక సందర్భాలలో చెప్పారు. విశ్వాసం, దైవభీతి అన్నవి ఔన్నత్యానికి నిదర్శనాలని అనేక మార్లు ప్రకటించారు. దైవం వాటినే చూస్తాడు. దైవభీతి భావన చాలా విస్తృతమైనది. దైవాన్ని సరిగా గుర్తించడం, దైవాదేశాలను పాటించడం, దేవుని దాసుల హక్కులు నెరవేర్చడం, మంచిని స్థాపించే చెడును నిర్మూలించే కృషి చేయడం, ఇవన్నీ అందులో ఇమిడి ఉన్నాయి. అనేక హదీసుల్లో ఈ భావన గురించి వివరణ ఉంది. **దుర్రాహ్ బింతె అబీలహబ్** ప్రకారం, **ఓసారి మహాప్రవక్త ముహమ్మద్ (స)ను ఒక వ్యక్తి "అందరికన్నా మంచి మనిషి ఎవరు?" అని ప్రశ్నించాడు. జవాబుగా ప్రవక్త (స), "అందరికన్నా ఎక్కువగా దైవగ్రంథాన్ని చదివేవాడు, అందరికన్నా ఎక్కువగా దైవానికి భయపడేవాడు, అందరికన్నా ఎక్కువగా మంచిని ఆజ్ఞాపించేవాడు, అందరికన్నా ఎక్కువగా చెడును నిరోధించేవాడు, అందరికన్నా ఎక్కువగా సంబంధాలు నెలకొల్పేవాడు మీ అందరిలోనూ మంచివాడు" అన్నారు.**

**(ముస్నద్ అహ్మద్)**

ఈ ఉన్నత గుణగణాలే మనిషి ఔన్నత్యానికి ప్రమాణాలు. మహాప్రవక్త ముహమ్మద్ (స) వద్ద ఈ గుణగణాలకే మర్యాద గౌరవాలు లభించేవి. హజ్రత్ ఆయిషా (రజి) ప్రకారం దైవభీతి తప్ప ప్రపంచంలో మరేదీ దైవప్రవక్త (స)కు నచ్చేది కాదు.

**"మహాప్రవక్త ముహమ్మద్ (స) దైవభీతి కలవారిని తప్ప ప్రపంచంలో మరెవరినీ ఇష్టపడేవారు కాదు."** **(ముస్నద్ అహ్మద్ : 6 / 69)**

## చివరి మాట

ఈ విధంగా ఇస్లామ్ మానవుల్లో మనుషులందరూ దైవదాసులనే నమ్మకాన్ని సృష్టిస్తుంది. మనుషులంతా ఒకే కుటుంబానికి చెందినవాళ్ళని అందరూ కలసిమెలసి దైవారాధన విధిని నిర్వర్తించాలని ప్రోత్సహిస్తుంది. మనుషులంతా ఒకే పని కొరకు సృష్టించబడ్డారు. ఆ పని - దైవారాధన. దేవుని దృష్టిలో ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ కాదు. అందరూ సమానులే. మనుషుల్లో జాతి, వర్గం, వర్ణం, ప్రాంతం, భాషాభేదాలు నిజమైన భేదాలు కావు, ఇవి బూటకపు ప్రమాణాల కారణంగా ఉనికిలోకి వచ్చాయి. ప్రళయదినాన దేవుని ముందు మనిషి గురించిన తీర్పుల్లో ఈ అల్ప విషయాలకు ప్రాముఖ్యం ఉండదు. మనిషి విశ్వాసం ఆచరణలే నాడు పనికివస్తాయి. దైవ విధేయత కలిగిన వారికే అక్కడ గౌరవం లభిస్తుంది. దైవభీతి కలవారికి, సదాచరణలు పాటించిన వారికే అక్కడ మర్యాద మన్నన. ఈ సుగుణాలు లేని వారిని దేవుని శిక్ష నుంచి ఎవ్వరూ కాపాడలేరు. హోదాగాని, వంశం, అంతస్తులుగాని యేవీ రక్షించలేవు. అలాంటి వ్యక్తికి కేవలం పరాభవమే మిగిలేది - ఈ విశ్వాసం వల్ల బూటకపు విచక్షణలు, వివక్షలు సమసిపోతాయి. మనుషులందరూ తమ విభేదాలు మరచి ఒకే పంక్తిన నిలబడతారు. ప్రపంచంలోని విభిన్న జాతులు వర్గాలన్నింటిని ఈ ప్రాతిపదికన ఒక్కటి చేయవచ్చు. ఇది తప్ప మానవ ఏకత్వాన్ని సాధించే మరో మార్గం యేదీ లేదు. ప్రపంచం ఈ మార్గాన్ని అనుసరించడానికి సిద్ధంగా ఉందా? కాలమే ఈ ప్రశ్నకు జవాబు చెప్పాలి.

- :సమాప్తం:-